రెంటాల గోపాలకృష్ణ

# సంఘర్షణ



సాహితీ స్రవంతి

# సాహితీ స్రవంతి

గాంధీనగర్, విజయవాడ


---

జయభేరి, సందేశం, సహాన్సు, ప్రతిజ్ఞ
అను కావ్య ఖండికలు
ఆగస్టు, 42 లో రఛింపబడినవి.


మూల్యం :
పన్నెండు అణాలు





తొలిముద్రణ :
వెయ్యి ప్రతులు
జూన్ 1950

---

4 సర్వోదయప్రెస్, నరసరావుపేట,

*

అసమసంఘ వ్యవస్థా బంధనలో

నలిగి, నీరసించే

పీడిత ప్రజా హృదయాలను

తన కవితా జ్యోతితో

ప్రజ్వలింప జేసిన

అఖండ సాహితీపరుడు,

అభ్యుదయ కవి,

నా సహపాఠి, మిత్రుడు,

శ్రీ అనిసెట్టి సుబ్బారావుకు

"Why have I sought my path
with fervent care,
If not in hope to bring my
brothers there?"

– Goethe

నవభారతం

నాందిగీతం

నాకావ్యం

మాతృదేవి

సముద్ర మథనం

విషాదోదంతం

జీవన్మృతులు

సిగ్నల్

కథనం

కరుణామయి

# నవభారతం!

నవభారతం శుభదాయకం!
జననాయకం సుఖదాయకం!
జననాయకం జయసాధకం!
నవభారతం ధృవతారకం!

సస్యశోభిత సంపదోజ్జ్వల
సర్వశిక్షిత రక్షితం!
విశ్వమానవ శాంతిస్థాపిత
విజయశంఖఘోషితం!

నవభారతం శుభదాయకం!
జననాయకం సుఖదాయకం!
జననాయకం జయసాధకం!
నవభారతం ధృవతారకం!

సంఘబేధం సంస్కరించిన
సత్యదీక్షాకంకణం!
పీడితప్రజ బంధముక్తికి
తోడునీడగు భారతం!

నవభారతం శుభదాయకం!
జననాయకం సుఖదాయకం!
జననాయకం జయసాధకం!
నవభారతం ధృవతారకం!

దాస్యశృంఖలు దగ్ధపరిచిన
ధర్మరాజ్యస్థాపితం!
సర్వశిల్పుల కళారీతుల
సాహితీ సంశోభితం!

నవభారతం శుభదాయకం!
జననాయకం సుఖదాయకం!
జననాయకం జయసాధకం!
నవభారతం ధృవతారకం!

# నాంది గీతం!

భానూదయం!
సుప్రభాతం!

అరుణచరణాలతో
ఆకాశమార్గాన
స్వేచ్ఛగావిహరించు
అభయనర్తనమిదే!

భానూదయం!
సుప్రభాతం!

పసిడినిగ్గులకాంతి
ప్రసరించితిమిరతతి
హరియించిలోకాన
ఆశమొలిపించేటి

భానూదయం!
సుప్రభాతం!

నిద్రాణజగతిలో
నినదించిధర్మాన్ని
ప్రాణప్రకృతికిసత్య
పథముచూపించేటి

భానూదయం!
సుప్రభాతం!

కష్టజీవుల మేని
కాంతితో మిళితమై
నవయువతికంటి చిరు
నవ్వుతో శృతికలుపు

భానూదయం!
సుప్రభాతం!

వరుడు ప్రాణాగ్నియై
వధువు ప్రకృతియై
నరుని పుట్టుకనాటి
నాంది సంగీతమిది

భానూదయం!
సుప్రభాతం!

## నా కావ్యం!

నాకావ్యం
  ఒకకల్చర్!

నా కాయం
  ఒకసోల్జర్!

నా వేశం
  ఆదర్శం!

నా గేయం
  "జడత" మీద
    పగబట్టిన పెనుసర్పం!

నా ధ్యేయం
  జగజ్జనత
    సుఖం, శోభ, సౌందర్యం!

లోకంలో
  శోకించే
    పతితుల ప్రాణాలన్నీ

నాపాటల
  వృక్షంపై
    పక్షులుగా విశ్రమించు!

నా కావ్యజ్యోతి
కాంతితో
నరహృదయం వెతుకుతాను
చూస్తాను! శోధిస్తాను!

లోకం ప్రతికోటీకులు
శోకంపోయే తెన్నులు
చూస్తాను! సాధిస్తాను!

సింహం గర్జించలేదు
చీమ చిటుక్కుమనలేదు
దుష్టశిక్షణకుయుద్ధం!
శిష్టరక్షణకు సిద్ధం!

సత్యం నాజయపతాక!

ఇదినాకల్చర్!
నే నొక సోల్జర్!

నవసృష్టికి నాందిగీతి
యౌవన చైతన్యజ్యోతి
నా కావ్యం!

# మాతృదేవి!

పల్లెజాతికి భాగ్యమైనా
తెల్లరాతి దివాణమైనా
మెట్టపంటకు మేటియైనా
పాడిపంటల గూడు అయినా
ఆంధ్రదేశపు హృదయ కేంద్రం
పల్లనాడు !

నేను పుట్టిన, నేను పెరిగిన
నన్ను పోషించేటి చల్లని
తల్లి నాదీ ! పల్లనాడు !

చల్లగాలికి వళ్లు ఝల్లన
పచ్చిగడ్డిలా పరకలేరే
పిల్లలందరి మడమ లంటుచు
కదిలి పోతుంటా !

నే కరిగి పోతుంటా !

పంటచేలో మంచెపైనా
పరిగపిట్టల పారద్రోలే
కాపు కన్నెల వలపు కులుకుల
తళుకు చూపుల
కారిగి పోతుంటా !

నే మురిసి పోతుంటా !

గొఱ్ఱెమందలు కోడెదూడలు
పాడిగేదెలు ఆలమందలు,
తోపులందున కాపుగాచే
కొంటెపిల్లల వెంటనంటే
ఆడు కొంటుంటా !

నే పాడు కొంటుంటా!

పద్యంపాడే గ్రామసీమల
పరుగు లిడుతుంటా !

నే పరవశతనుంటా !

చంద్రవంకల ఇంద్రకాంతిలో
నాగులేటి నాట్యకళలో
నాగవిజయుని శిల్పకల్పిత
బుద్ధస్తూపం సొగసువన్నెల
వెన్నెలలలో సోలిపోతుంటా !

నే తేలిపోతుంటా !

నాగమాంబా నడుముఖడ్గం
బ్రహ్మనాయని సింహనాదం
బాలచంద్రుని పచ్చిరక్తం
కనమదాసుని కత్తిపదును
తలచు కొంటుంటా !

నే కలలు గంటుంటా !

మరపురాదీ సీమ పలనాటిసీమ !
మాసిపోదీ గాథ పలనాటిగాథ !

# సముద్రమథనం!

సముద్రమథనం! సముద్రమథనం!
సముద్రమథనం జరిగింది,
సముద్రమథనం! సముద్రమథనం!
దరిద్రమంతా కరిగింది.

మహామేరువూ మందరగిరులూ
హిమవద్గిరిపై శిఖరాగ్రములూ
మంటికి మింటికి ఏకపంక్తిలో
రెక్కలు విప్పుక నిలుచున్నవి!

సహస్ర మణిగణ శేషఫణీంద్రుడు
పర్వత పరిధిగ చుట్టిన రజ్జువ
దేవదానవులు చెరియొకవైపున
భుజబలములతో పట్టారు!

సప్తపయోధుల సంగమగర్భం
సమస్తలోకం ఘూర్ణిల్లా!
ప్రళయకాల రుద్రాగ్నిజ్వాలలు
హాలాహలమై ధరపొంగా!

మథించిజలనిధి మథించిజలనిధి
భువనశ్రేణులు కదలంగా!
అనంతశక్తులు! అనేకమూర్తులు!
స్వేదబిందువున స్వేచ్ఛావీరులు!

స్థావరజంగమ సమస్తసృష్టిగ
జీవతతుల పరిపూరిత దృష్టితో
సముద్రమథనం! సముద్రమథనం!
సముద్రమథనం జరిగింది!

క్రోధారుణ నేత్రాంచితదీప్తిగ
అంతిమ సమరం! ప్రపంచవిజయం!
మానవకోటికి కృషిఫలితంగా
అమృతభాండం కదిలింది!

క్రమబద్ధంగా సమధర్మంగా
సంఘర్షణ సఫలంగా
భాగవిభాగం జరిగింది!
ధరిత్రి శాంతిని పొందింది!

# విషాదోదంతం!

పతిత యువతుల బజారు
పాటపెడుతూ వుందిచూడు!

గతిచాలక మతిభ్రమించి
పతులు పదుగురై చితికిన
దేహాలు! బ్రతుకీడ్చే ప్రాణాలు!
వృధావ్యధలు, శోకాలు!
నీ సౌధాలనుచుట్టి
ఆక్రమించి ముంచేస్తాయి!
మెతుకులు మ్రింగకపోతే
మిసమిసలాడదు దేహం!

ఈచితిలో చివికిపోయి
మెతుకులకై బయలుదేరి
అతుకు లలంకారాలై
పోతున్నా వెందుకు?
ఈ లోకం నూరుకండ్ల
క్రూరంగాచూస్తూ, తన
గోళ్ళువిప్పి ఎగబడుతూ
చీకటి బ్రతుకుల గుట్టును
పట్టపగలే బ్రద్దలుచేస్తోంది!

ఈసందుల గొందుల్లో
ఎలా సహిస్తావు ఘోర
దారుణాన్ని, నరకాన్ని?

సీతని పీడిచినస్థితి నీ
బిడ్డలు గడ్డలుగారా?

యౌవన మున్నంతవరకె
జౌనని మెప్పించుతారు,
అర్థం గుప్పించుతారు,
పిదప విసర్జిస్తారు!
మనసున్నా, లేకున్నా
వలపు నటించిన కులికిన
వాస్తవ మొకరోజునిన్ను
భయపెడితే బాధిస్తే
భరించలేవు, విలపిస్తావు!
తల్లీ! చెల్లెలు! పిల్లలు!
చూడకవళ్లను గుల్లగ
చేసిన ఈ అన్యాయం
చీల్చుతుంది లోకాన్ని!

పతిత యువతుల బజారు
పాట పెడుతూ వుందిచూడు!

మదాంధులకు దాసీలై
మెలగిన మీ చరితలు,
మొలసిగ్గును బలిచేసిన
మీ బ్రతుకులు, భారత
యువతుల ఖ్యాతిని
పరాభవిస్తాయి నిజం!
కానీ, ఇది మీ నేరం
కాదు! సర్వలోకానిది!

పవిత్రాభిమానాన్నే
పతితయువతు లమ్ముకు నే
ఈ లోకం ఏనాడో
కుళ్ళి కుమిలి పోతుంది!
కూలి ధూళి కలుస్తుంది!

# జీవన్మృతులు!

త్రాణలు కోల్పోయిన ప్రాణాలివి !
మరణావస్థల తుదిశ్వాసలు పీల్చుచు
కుమిలికుమిలి కూడిన పరితాపం !
రాకాసుల మండించే శాపం !

లోకం మీపై భీకరదృక్కుల నిగిడ్చి
నాల్కసాచి వెక్కిరిస్తోంది !
మీరంతా నేరస్తులు, మీఆస్థికి హక్కులేదు !
మీస్థానం చీకటిప్రస్థానం !

న్యాయం వప్పదు మీచర్యలు
చట్టం గర్హిస్తుంది ! మీస్థితియింతే !

ఆశయసిద్ధికి చేసిన సమరం
క్రూరంగా భావించుక
బంధించిందీ పాషాణం !

కలుకు అంపపుగోడల మూలల్లో
చెరసాలలు కలిచిన చేతుల సంకెళ్లు !
విరిగిన కోరిక లరిగిన గొలుసుల
మరసంధుల్లో నలిగిన ప్రాణంలంకెలు !

శుష్కించిన దేహం ! సళ్లొదలిన నరాలు !
కొడిగట్టిన జ్యోతుల గోళం కండల్లో
కుతకుతమంటున్నది శవమై జీవుడు !

పండని ఆశలతో ఎండిన మనస్సులు!
భూగోళం బ్రద్దలుకొట్టే తపస్సులు!

నాలుగు చెరగుల వారధి దరితెగి
అంబరవీధిన పరుగెత్తిన నిస్పృహతో
దృక్కులు సోకిన దూరం శూన్యంగా
గుప్పిట వత్తుక నిలిచుందీ ప్రాణజగత్తు!

తుపాకి మడమల పొడుపులు
తురాయి లయి ధరిస్తే
ధరిత్రి తనతో భుజించిన - చరిత్రను మరువదు!

# సిగ్నల్!

తప్పుకోండోయ్!
తప్పుకోండోయ్!
దారివిడిచీ
తప్పుకోండోయ్!

తరతరాలుగ తెలుగుగడ్డను
ఖడ్గమున బంధించి ముంచిన,
నరుల హాహాకారములలో
నాట్యమాడే ప్రభువులారా!
దారివిడిచీ తప్పుకోండోయ్!

కష్టజీవుల మేని స్వేదం
కనకరాసులు పండుతుంటే,
నిలువుదోపిడిచేసి కోటకు
కొలువుగట్టిన క్రూరకర్ములు!
దారివిడిచీ తప్పుకోండోయ్!

రాజమహలే రాతిగుండెగ
ప్రజాపాలన చేయుచున్నది!
నరుడు శివుడై నడచినేడు
తాండవము సాగించినాడు!
దారివిడిచీ తప్పుకోండోయ్!

వెలుగుచున్నవి ప్రజానేత్రం
వెడలగ్రక్కే విస్ఫులింగాల్!

ఉక్కు కారాగారములలో
ఉడుకుచున్నవి నరులప్రాణాల్ !
దారివిడిచీ తప్పుకోండోయ్ !

ప్రజలు లక్షలుకోట్లు నేడే
విజయపథమున వెడలినారు !
సమరయాత్రలు, ధర్మయాత్రలు
సాగుచున్నవి, జయిస్తాయి !
దారివిడిచీ తప్పుకోండోయ్ !

భూతకాలం పాడుబెట్టిన
భావిసృష్టికి భయంతెచ్చిన
ప్రజల కాల్చిన ప్రభువులారా !

భారతావని గడ్డపై మీ
రొక్కరైనా వున్నరోజున
ముక్తిలేదీ మాతృభూమికి!
రక్తపాతం కాకముందే,

తప్పుకోండోయ్ !
తప్పుకోండోయ్ !
దారివిడిచీ
తప్పుకోండోయ్ !

# కథనం!

వినరా ! భారతవీరుడా !
విని లోకానికి చాటరా !

ఉన్నాడు ఒక జమీందారురా ! దున్నవంటి కారురూపురా !
చదువులేని శుద్ధమొద్దురా ! పదవి ఆతని పెద్దరథమురా !

ఇల్లంతయూ యినప్పెట్టెరా ! వళ్లంత బంగారు పూతరా !
మనసు మెలికల ఇనుపగొలుసురా ! కోతపడని రాతిగుండెరా !

పదిమంది బంట్రోతులుండెరా ! పడరానిబాధలు పడుచురా !
పసిడిముద్దలు పెళ్ళగించిరా ! ప్రాణాలు బలిపెట్టినారురా !

పగలెల్ల బయటికిరాడురా ! పనులన్ని చీకటిలోనెరా !
కోటవంటి మేడలోపలా కులుకుచు తా కూరుచుండెరా !

ఎందరిప్రాణాలు తీసెరా ! ఎన్ని కుటుంబాలు కూల్చెరా !
దినదినము గుండెలుమండెరా! కసితోటి హృదయాలు నిండెరా!

ప్రజలింక బాధలు సైచక పగబూని ఐక్యమై కదలిరీ !
చక్రాల బంధించివేసిరీ ! అగ్నిధనస్సుల నెత్తిరీ !

జేగంట మింటికి మ్రోగెరా !
జయము ప్రజలందు కొన్నారురా !

# కరుణామయి!

ధరణీ! ధరణీ!

నీచరణాలంటినబిడ్డల
కరుణజూడుమమ్మా!
ధరణీ! ధరణీ!

నరజీవనయాత్రకు
పవిత్రక్షేత్రాలయమయి
వరమీయగజాలిన వాంఛలు
నెరవేరగ మూలాధారం!
ధరణీ! ధరణీ!

ఎండిన ఉరుతరువులు
పుష్పించిన చిరులతలు
మండిన మానవ తలపులు
గుండెలు చీల్చిన అలుగులు
ధరణీ! ధరణీ!

పొంగిన జలధితరంగాలు
ఇంకిన నదీనదాలు
నింగి చూచు గిరిశృంగాలు
కృంగిన జనసమూహాలు
ధరణీ! ధరణీ!

భోగులు, విజ్ఞ లజ్ఞానులు,
యోగులు, జోగులు అంతా,

ఏతాకృతి పదిలంగా,
నీహృదయంలో చరిస్తారు !
ధరణీ ! ధరణీ !

అరుణా లంకృత శోభలు
నవ్యా భరణపు కాంతులు
సరళద్యుతు లీనిజగతి
పర పీడన వీడి ప్రగతి
ధరణీ ! ధరణీ !

నీ చరణాలంటిన బిడ్డల
కరుణ జూడు మమ్మా !
ధరణీ ! ధరణీ !

జయభేరి

సందేశం

సారంగం

ఉద్ధానం.

ప్రవృత్తి

శిఖి

సహాస్ర

నిష్క్రమణ

యుగవాణి

ప్రతిజ్ఞ

# జయభేరి

ముందునడువు! ముందునడువు!
ముందునడువు! ముందునడువు!

కట్టబట్టలేకయున్న
కడుపునిండ కుడువకున్న
ఖడ్గమొకటి దొరకకున్న
కరముసాచి శిరమునెత్తి!

ముందునడువు! ముందునడువు!
ముందునడువు! ముందునడువు!

బెదురులేక ప్రజలశక్తి
ఎదురుపడ్డ అరులమొత్తి
గిరులు తరులు నురుముచేసి
తిరిగిరాక మరలిపోక

ముందునడువు! ముందునడువు!
ముందునడువు! ముందునడువు!

మేఘపంక్తి మీదపడిన
కొండవిరిగి కూలబడిన
గుండెనొడ్డి పిండిచేసి
దండుసాగ ధరణిపొంగ!

ముందునడువు! ముందునడువు!
ముందునడువు! ముందునడువు!

జ్ఞానజ్యోతి చేతబట్టి
అంధకారమణగగొట్టి
నవ్యారుణ దివ్యకాంతి
నర్తనముల దిక్కులవియ

ముందునడువు! ముందునడువు!
ముందునడువు! ముందునడువు!

విజయభేరి వేసిగాని
వీరమరణమందిగాని
కార్యసిద్ధిగలుగువరకు
కన్నుమూయకుండ నడువు!

ముందునడువు! ముందునడువు!
ముందునడువు! ముందునడువు!

# సందేశం!

విననండి వీరుల్లారా!
  కననండి కార్మికులారా!
అభాగ్యులకు ఆదేశం!
  దరిద్రులకు సందేశం!

పరరాజ్యం తరలిందీ!
  మనరాజ్యం వచ్చిందీ!
కానీ, కడుపులునిండవు!
  కానీ, ఆశలు పండవు!

కారణాన్ని కనిపెట్టండి!
  దారుణాన్ని అరికట్టండి!
సామాన్యుడు సాగిలపడితే!
  సంపన్నుడు సమ్రాట్టవుతూ,

దేశమంత దోచేస్తుంటే
  నాశనమై నలిగేపేదలు!
వస్తులతో చస్తున్నారు!
  పైకిలేచి వస్తున్నారు!

వడివడిగా నడవండీ!
  ఎఱుగెత్తి అరవండీ!
విననండి వీరుల్లారా!
  కననండి కార్మికులారా!

ఉరిమిందొక జనమేఘం,
  అదిరిందీ భూవలయం!
వీచిందొక సుడిగాలి,
  లేచిందొక పెనుధూళి!

పొర్లిందొక జలపాతం!
  దొర్లిందొక హిమాలయం!
కలిగెను నవచైతన్యం!
  వెలిగెను విప్లవజ్వాల!

వినిపించిందొక ఘంట!
  కనిపించిందొక మంట!
ఆపలేరు యీరోషం!
  ఆవరించు యీ ద్వేషం!

వినండి వీరుల్లారా!
  కనండి కార్మికులారా!
ఎవరాపుదు రీశక్తిని?
  ఎవరడ్డుదు రీకత్తిని?

త్వరత్వరగా నడవండీ!
  జయపతాక నెత్తండీ!
చరిత్రనే జనకాంక్ష
  స్వరూపాన నిలపండీ!

# సారంగం!

ఉదయించే రథసారథి
కరపల్లవ కాంచనమయ
కంకణరుచు లాకాశం
కమ్మి జగతి వ్యాపించెను!

వసుమతి వదనాంతరమున
ప్రభవించిన ప్రాణకాంతి
సూర్యకిరణ పరిష్వంగ
శోభజగతి దీపించెను!

అగ్నికేతు వాకాశం
భగ్గుమనగ పైకిలేచి
దిక్కులన్ని దద్దరిలగ
గగ్గోలుగ తిరుగుతోంది!

రక్తధ్వజ లాంఛనాలు
శక్తి చేతి శస్త్రాలై
శత్రుమూక చెండాడుచు
క్షాత్రం చాటును నేడు!

సాగర కన్యలు రాగా
లాపనచేస్తూ మంగళ
నీరాజన మిస్తున్నారు!

వికసించిన సరోజాలు
విరజిమ్మెదు పరిమళాలు
వినువీధిన అతివిచిత్ర
గతి నృత్యం చేస్తున్నవి!

ప్రభాత భేరీ నాదం
ప్రజలకు వినిపిస్తున్నది!
భారత నారీ లోకం
తోరణములు కడుతున్నది!

పరుగులతో యువకులంత
భారత స్వేచ్ఛాగీతం
ప్రపంచశాంతి నినాదం
దుందుభి మ్రోగిస్తారు!

నవయువకుని హస్తాంచిత
పరిపూరిత భానుమూర్తి
ధనుజ్యా టంకా రావం
గగనం కీర్తిస్తున్నది!

కార్మిక కర్షక లోకం
కాలానికి కట్టవేసి
క్షామబాధ తీర్చుతోంది!
చరిత్రగతి మార్చుతోంది!

నవభారత రాజ్యం మేం
పవళించెడు పసిడిపాన్పు!
ఇది మా నిర్మాణంలో
సమధర్మం సాధనగా

అభయంగా నిలుస్తుంది!
విశ్వానికి విజయ భేరి!
భువనానికి నవ్యకాంతి!
విభవోన్నతి! విమలకీర్తి!

# ఉద్ధానం!

ఆహుతి! ఆహుతి!
ఆకలిమంటలు హెచ్చి
అగ్నిజ్వాలలు లేచి
ఆర్తులను, అనాథులను
ఆహరహమ్ము పీడిస్తున్నవి!

నోరులేని జీవులుఎన్నో
పేరులేని పక్షులుఎన్నో
జగతిని కమ్మిన మంటలలో
కుమిలి, కాలి హతమవుతున్నవి!

చిక్కిన దేహాలలో
ఎండిన డొక్కలలో
జిగితరిగిన కన్నులలో
బిగితప్పిన నరాలలో
పేలికలౌ చేతులలో
కొట్టుకునే కొన ప్రాణాలివి!

ఈకన్నులు ఆశలుడిగి
శీతలించు గోలీలు!
ఈ నరాలు బాధాయుత
దేహాలను బంధించే వలలు!

ఈ చేతులు అరగదీసి
పారేసిన కృపాణాలు!

ఈ ప్రాణాలు స్వర్గనరకముల
పొలిమేరలలో ఊగుతున్న దీపికలు!
తిండిలేక ఎండిపోయి
గోచీ పాతలతో
వీధులంట తిరగలేక
విరుచుక పడిపోయే
ఈ బిడ్డలు !

పస్తులతో దహిస్తున్న
తమ్ముళ్ళను శపిస్తున్న
బ్రతుకు భారమై ఏడ్చే
బడుగు ప్రాణులీ భార్యలు !

ఎండా వానల కూలిన
గుడిసెలనే మేడలుగా
భావించే నివసించే
నికృష్టుల జాలిచూపులకు

కరుగని గుండెలు కదలని
మనసులుగల యీ లోకానికి
ముక్తిలేదు ! బ్రతుకులేదు !

పాపం ! మరి వీరంతా
ఎక్కడికని పోతారు ?
ఎలాగ బ్రతుకీడ్చుతారు ?

నీరసించు నాళలతో
బ్రతుకే పరమశత్రువని భావిస్తే



లోకంలో సృష్టిలేదు
ఈ జగతికి ప్రగతిలేదు.

కనుక మానవుడు బ్రతకాలి!
కష్టాలనునిర్గమించి

బ్రతుకును స్వర్గంగా మార్చాలి!

ఇదేమనకు కర్తవ్యం!
ఇదేమనకు తొలియత్నం!
అప్పుడు తప్పదు!

తొలకరివానలు కురుస్తాయి!
కొత్తసిరులు విరుస్తాయి!
మనకోరిక ఫలిస్తుంది!
మానవాళి తరిస్తుంది!

# ప్రవృత్తి!

విశ్వం శాసించిన
విజయం సాధించిన
మానవుడే సృష్టికర్త!
మానవుడే జగతిభర్త!

మానవశక్తికి సాధ్యం
కానిది లోకాన లేదు!

మానవుడా! నీ మహిమలు
పురాణాల రాయలేదు!
వేదంలో చెప్పలేదు!
ఋషులే కృషిచేయలేదు!

జగచ్చరిత్రయె, నిత్యం
ఘోషిస్తున్నది, సత్యం!

నరుడొక్కడు దాస్యంలో
నవసినంతకాలం ఈ
లోకానికి ముక్తిలేదు!

ప్రపంచ విజయం!
స్వర్గం నరకం
పాపం పుణ్యం
అంతానీదే, నీలోనివే!

స్నిగ్ధమూర్తి మానవుడా !
చిరకాలం అనుభవించు !
నీకు భయంలేదు సుమా !
నీ జీవిత మనంత మిది !

పగబట్టిన మృత్యువో,
ప్రభువో, ఎవరోకానీ
పడగవిప్పి ఆడితే
పాటమాయ జోకొడితే
వింటావా ? ....

" మనం ! మనం ! మతం! మతం !
మనిషి ! మనిషి ! హతం ! హతం !
మదమెక్కిన ఘనం ! ఘనం !
అధికారం ధనం ! ధనం ! "

చెప్పేత్యాగం, చేసేస్వార్థం
చైతన్యం కలిగిస్తుందా ?

పులికోరల విషం
ఈ ప్రభువుల పౌరుషం
ప్రతిఘటించి నిలుస్తావా ?
భయపడి పరుగెత్తుతావా ?

సహించని నీ ద్వేషం
ఆవహించిన రోషం
పోరాటానికి తప్పక
పురిగొల్పును సుమా నిన్ను !

తత్వం బోధపడిందా

తపస్సు ఫలిస్తుంది !

తమస్సు విడిపోతుంది !

ఉషస్సు వ్యాపిస్తుంది !

## శిఖి!

అనంత ఆకాశపు టంచుల్లో
కాంతులు ప్రసరించే నక్షత్రాలు!
ఆకలిమంటలలో అణగారిన
జీవుల కనుగొలకుల బాష్పాలు!

యుద్ధరాక్షసుల కూపిరిపోసిన
అధఃపతిత నరరాజ్యాలు!
యుగసంధుల్లో దిగబడి నలిగెడు
మానవ సమూహ మరణాలు!

మనిషిని మనిషే హతమార్చాలని
మౌఢ్యం, మత విద్వేషాలు!
ఈ రోషానలమున కింధనములుగా
శత సహస్ర యువప్రాణాలు!

తరుణరక్తమును నాగటివాళ్ళకు
ధారలుపోసే కర్షకులు!
తిండికి చాలక తిరుగుబాటుతో
సమ్మెలుచేసే కార్మికులు!

చెరసాలల చీకటిలో ధైర్యం
చితికిపోని యువకిరణాలు!
నవ్యసృష్టికి సకలం త్యజించి
పోరిన వీరుల ప్రాణాలు!

# సహస్సు!

సాగిపోంది! సమరభూమి!
ఆగకంది! అదనుమీరి!

మిన్నువిరిగి మీదపడిన
కన్నుచెదరి గాటుపడిన
కార్యదీక్ష వీడకుండ
కదలిపోంది! కదనసీమ!
సాగిపోంది! సమరభూమి!

ప్రజకంఠం పలుకుతోంది!
సమధర్మం సాగుతోంది!
అన్యాయా లరికట్టగ
ఆఖరు ప్రాణంవరకును
ఆశలు విడువక త్యాగం
చెయ్యాలని తెలుసుకోంది!

బరువెక్కుచు మీహృదయం
మరుగుచు పారినరక్తం
పవిత్ర ధరిత్రినిండా
వస్త్రంలా కమ్ముతోంది!

చీకట్లను ఛేదించుక
విద్యుత్కాంతులు విసరుచు
సద్యోగర్భం దాల్చిన

సమధర్మం సాగుతోంది!
పృధ్విగీతి పాడుతోంది!

సూర్యుని క్రూరదృష్టుల
చూసి ప్రతిఘటిస్తున్నవి
ఒక్కటిగా నలుదిక్కులు!
ఉర్వీస్థలి నెదుర్కొను
గర్వం చాటినమేఘం
కరిగి జారిపోతోంది!

ఫలించని ఆశలతో
జ్వలించిన గుండెలు!
తలలువంచి పొంచిచూచి
బయటికి తీసినకత్తులు
ప్రభలు చిమ్ముతున్నాయి!

హిమవద్గిరి వేదికపై
గౌరీశంకర శృంగం
కాంచన గంగాశిఖరం
శివనృత్యం చేస్తున్నవి!

ప్రగతి ప్రజాకంఠం, భువి
ప్రతిధ్వనించ పలికింది!
' మానవుడా! అంత్యరక్తబిందువు
భూస్థలి ప్రవహిల్లు వరకు
ప్రళయాగ్నులు ప్రజ్వరిల్ల
సంఘర్షణ సాగనిమ్ము! '

సమరయాత్ర విజయంగా
సాగుతోంది! సాగిపోంది!

ఈ క్రతువే ఫలిస్తుంది!
జయపతాక నిలుస్తుంది!
సమధర్మం స్థాపించగ
సాగిపోంది! సమరభూమి!

# నిష్క్రమణ !

అఖండశక్తులు ఆవిర్భవించిన
యీ వసుంధరా గర్భంలో
వితండవాదుల దుర్భరచర్యలు
గర్జించిన యీ లోకంలో

కష్టసుఖాలు నిమ్నోన్నతాలు
కలిమిలేములు కాంతి మరుగులు
ఆశనిరాశలు అంతర్వ్యాప్తులు
స్వార్థత్యాగాలు సహన అసహనాలు
నిస్పృహనిగ్రహాలు, భయసంభ్రమాలు

ఏకంగా మిశితమై మానవ
ప్రకృతిలో లీనమయి

వికసిత సరోరుహసమంచిత
విలాస భాసితంగా
ముకుళిత వకుళాలయ
శకలం మూర్తివంతంగా
విజృంభించి చూస్తుండగనే
అంతలో అణగారిపోయింది !

' ఏంటో వింతజీవితం
తింటం అలవాటైపోయింది ! '

హృదయ పయోధిలోని
వూహాతరంగాలు
తురంగాల్లా లేచి, గిరి
శిఖరాలను పెకలించి
పరుగెత్తినవి!

నిలకడలేని కెరటాలు
ఉయ్యాలలూగి
కిలకిలధ్వని చేసినవి!
దరిచేరినవి కాకిచిప్పలు,
నత్తగుల్లలు, చిల్లపెంకులు
చిందరవందరయి!

మణిపూసలు మంచిముత్యాలు
కొన్ని మిలమిల మెరసినవి!

బెస్తవాళ్లు చూస్తూ
తమపస్తుల జీవితాలకు
నేటితో స్వస్తియని
ఉరుకుల పరుగులతో
వలలుపన్ని గుటకలుమింగి
కాపలా కాస్తున్నారు!

పాపం! వాండ్లెరుగరు
పైనపోయే పక్షులు
కోపంతో శాపం పెడ్తాయని!
నీటి బుడగలాగ
గాలి పటంలాగ

మెరపు తీగలాగ
ఎప్పుడో ఎగిరిపోతారని !

భ్రాంతిలో మునిగి
క్రాంతిలో చిరిగి
కరిగి పోతున్నారు
కాల స్రవంతిలో



శాంతికోసం విశ్రాంతిలేక
పరిశ్రమించిన వీరిజీవిత
రథచక్రాలు !

బ్రహ్మాండ భాండం పరిభ్రమించి
రోదసీకుహరం ప్రతిధ్వనించి
ఖాండవదహనం చేసిన
గాండీవికి కరుణ లేదంటూ
కందెన వేసిన యిరుసుపై
గరగరతిరిగి పోతున్నవి !

చిత్రికబట్టిన ఆకులు
శీఘ్రగమనంతో శిరసులు వంచినవి !
శ్మశానభూమిని శయనించిన
కొన్ని నికృష్టపు శవాలను
నక్కలు పీకుతున్నవి !

కుక్కలు కొట్లాడి విడిచిపెట్టిన
కొన్ని ముక్కలను పట్టపగలే
చెదపురుగులు, చిట్టెలుకలు,

చిక్కించుకొని వెక్కిరిస్తూ
వేటాడినవి !

అంతరిక్షంలో తీక్షణంగా
గమనిస్తున్న గ్రద్దొకటి
కాలదన్నుక పోయింది !
కూడబెట్టిన గృహంలో
మార్జాలం ప్రవేశించి
వెన్నముద్ద చప్పరించి
'గోడెక్కి దూకింది !

పాశ్చాత్య నాగరికతాసక్తులై
ప్రజలే నిజధర్మాలకు నీళ్లువదలి
ట్రెయినుల్లో, ట్రాముల్లో,
బస్సుల్లో, బండల్లో,

యిసుకవేస్తే రాలకుండా
విసుగులేకుండా
బజార్లుపట్టకుండా
రోడ్లు కిక్కిరిసి వడివడిగా
నడుస్తున్నారు !

ప్రక్కన మురుగుకాలువలో
నీరు ప్రవహిస్తున్నది !
పోతున్నారు ! కార్లలోజనం !
భేదం ఏమిటి ? ప్రబోధందేనికి ?

దర్శనంకాని ఆదర్శమా !
అందుకు నిదర్శనమా !

సిల్కుచొక్కాల జేబుల్లో డబ్బులు,
షాపుల్లోని క్యాషు,
ఇనప్పెట్టెలోని ధనం
మేడలోని సామాను

కాని ఏం ప్రయోజనం ?
దేనికదే ! చెట్లనీడల్లో
కునికిపాట్లు పడుతున్నారు
కూటికి లేనివాండ్లు !

తోటివారి కష్టం
పాటించడం అయిష్టం !
దిష్టిబొమ్మల్లా చూస్తూ,
తలలు వాలుస్తున్నారు !

ఛీ: ఛీ ! లోకం !
అబ్బబ్బ ! శోకం !
డబ్బొక జబ్బయిపోయింది,
జబ్బంటే డబ్బంటాడు డాక్టరు

ఎంతకాలం ఓర్పుతోవున్నా
కాలంలో మార్పురాదా ?
వచ్చిందిలే ఏదోవిధంగా !

మంత్రంపోయి మంత్రులు
తంత్రం దాచుక యంత్రం,
ఋషిపోయినాడు, తృషవచ్చింది,
వేదాలొద్దు, పదాలుపాడాలి !

తద్దినానికి తర్పణించాలు !
ప్రొద్దున్నే పత్రికరావాలి !
లక్సుసోపుపై తారల అభిప్రాయం,
సెక్సు పత్రికల అర్థంలేని ప్రచారం.

పురాణం అక్కర్లేదు విరాళాలుకావాలి
పనిలేనప్పుడు సినిమాహాలు,
ఏదైతే ఏం ? కాలచక్రం
దొర్లుతూ వున్నది !

పాలకవర్గం తరలుతూవుంది !
కాఫీహోటళ్ళు సాఫీగా
సాగిపోతున్నవి !
చెరువులో బెకబెక మంటున్నవి
కప్పలు !

గ్రీష్మకాల ఋతుపవనం వీస్తున్నది!
వాపీకూపతటాకాలు
కోపంతో లేచిపోయినవి !
సాగరగర్భంలోని జలచరాలు
పరుగెత్తి బొరియల్లో దూరినవి !

శోకం పోలే దీ నాటికి.
లోకం కన్నుమూసి
పన్నాగం ఆలోచిస్తున్నది !

శ్రీమంతుల సీమంతాలు
దొంతర చామంతులు
కొన్ని మంతనం చేస్తున్నవి!
ఆగంతకులు చింతాక్రాంతులై
పంతంవీడక హంతకుల
వెతుకు తున్నారు!

శతృశిరఃఖండన క్షాత్రధర్మమనే
వీరపుత్రులు కోరమీసాలు దువ్వుతున్నారు
అవక్ర విక్రమోపేతులై
చతుస్సముద్ర ముద్రిత
వసుధా చక్రాన్నిపాలింప,
నిర్విరామ కార్యక్రమంతో
దుర్వార బలాన్ని సమీకరిస్తున్నారు!

విలింపులకు తలవంపులై
చలించిన గుండెలతో
పోలికలను పరీక్షిస్తున్నారు!

రణంలో మరణమో
కాక విజయ వీరణమో
తుదినిర్ణయమైంది యోధులకు!
వైరివర్గాన్ని నిర్గమించి
దుర్గమ స్థావరాలాక్రమించి,
సాగిపోతున్నవి
వాజీ గజభట సమూహాలు!

రథనేమి కింకిణీ ఘణఘణలు,
దేవదత్త శంఖారావాలు,
కర్ణపుటాలు వ్రక్కలించినవి !

భర్గదత్తమైన పార్ధుని పాశుపతం
అగ్నిశిఖలు గ్రక్కుచు ఆక్రమించింది
ఇంతలో పరీక్ష !

విపినాంతరంలోని హర్యక్షుని
దుర్నిరీక్ష ప్రతాపాగ్ని
దిగ్దంతాలు కాలుస్తూ,
భూనభోంతరాళాలు ఛేదిస్తూ
గర్జించింది !
మత్తగజమస్తిష్కవ్యసనావస్థలో
విహరిస్తూ దర్జా చూపింది !

పర్జన్యుడు బంటుగా నిలబడి,
ప్రవజ్యను పరిత్యజించి,
సామ్రాజ్యం స్థాపించాడు !

అమరులకు అర్థమయింది,
పారిజాతాలు, కస్తూరి గంధాక్షతలు,
శిరస్సులపై వేసి ఆశీర్వదించారు !
విజయం కలిగింది !
ప్రజలకష్టం తొలిగింది!
గజసింహాసనంపై కాగడా, వెలిగింది

ఓం శాంతిః శాంతిః శాంతిః

## యుగవాణి :

చీకటి ! చీకటి ! అంతాచీకటి !
నిత్యం మండే ఆకలి !
నిరంతరం ఆందోళన !

పసరెక్కిన పచ్చిగుండె ఉడికిన
ప్రకృతి అంతా కుళ్ళి విషాదం
వెళ్ళగ్రక్కు తోంది !

లోకం చీకటితొడపై
చిన్నపిల్లలా ఏడ్చిఏడ్చి
పడుకున్నది !

సుడిగుండంలా సుషుప్తి
విషవాయువు బుసకొట్టుచు
కసిదీరగ నమలి
నెమరు వేస్తోంది !

విశాలకరాళ రాత్రులు !
విసిగించిన జీవనయాత్రలు !
పులికోరలు చీల్చిన
పవిత్ర ధరిత్రిరోదన !

ప్రగతి పరిహసించింది !
రాజుల మోజులు తగ్గవు !

ధనమదాంధు లధికారం త్యజించరు :
నరులకు దాస్యం తొలగదు !

గతం ప్రస్తుతా న్నిడ్చుకు
పాతాళంలో తోస్తే
ప్రజలెక్క డెక్కడికో
పడిపోతున్నా రనాథులై !

గుసగుసలు, కోపాలు,
కృపాణాలు, క్రోధాగ్నులు ...
వగతో పెరిగింది పగ !
తూర్పు కొండకు
బారెడు దూరంలో
పగిలింది ! మరఫిరంగి !

రగిలిన మంటల రక్తం !
విరిసిన పంటల భుక్తం !
భూగోళం బ్రద్దలైంది !

చేరెడు నేలను పరుచుక
పురిటిబిడ్డ కన్నుతెరుచు !
పీడిత జనముల పిడికిలి
బిగిసిన జగత్తు
జాగృతమై చరిస్తుంది !

దుర్భర మానవ జీవిత
గర్భంలో దాగిన వ్యధ
విశ్శబ్దం తెడుచుకుంది !

నవచైతన్యోద్దీపిత
యువ హృదయం,
యుగ కంఠం! పలుకుతోంది!
అంతిమ విజయం మనదే!
అఖండమీ ఘన విజయం!

## ప్రతిజ్ఞ!

### శక్తి:

ఇది దౌర్భాగ్యుని స్వప్నంలో
తలచుకున్న స్వీయగాధ!
ఇది గర్భగుడి మూలల్లో
కుములుచున్న మనోబాధ!

ఇది జీవిత పరమావధికై
చేయుచున్న కర్తవ్యం!
ఇది భావికాల పరివర్తనలో
దాగియున్న ఆంతర్యం!

ఇది లోకానికి స్పష్టపరచి
చాటుచున్న నిజసత్యం!
ఇది ప్రజలకు కనువిప్పుచు
సాధించిన జయకృత్యం!

ఇది వసంత శరదంత సంతానంలో
ప్రదోష గీతిక లాలాపించిన విపంచి!
ఇది నియంత హంతకచర్యలు
అరికట్టిన క్రాంతి సాగరుల జయంతి!

ఇది అనాదిభారత సంస్కృతిలో
రేకెత్తించిన తళుకురేఖ!

ఇది జనాధి నేతల హృదయంలో
జ్వలించిన మెరపుతీగ !

ఇది శ్రమజీవుల స్వేదోద్భవ
స్వేచ్ఛావాణి !
ఇది క్రమశిక్షిత యోధవరుల
ప్రియపాణి !

ఇది పాతక్రొత్త భావాలకు
అనుభవాల యుగసంధి !
ఇది జీవన పరిశోధనలో
విజయానికి నాంది !

శాం తి :

దారిద్ర్యానికి ఎరయై
దిగజారిన హృదయంలో,
దారులు వెతకెడు ప్రాణం
దనలోపల తాను ఏడ్చి
కాంక్షించకయే కలిగిన
బిడ్డల కడుపులు నింపగ
పిడికెడు మెతుకులు
పెట్టగ భృతిచాలని
బ్రతుకులు భారంగా,
దినమొక గండంగా
గడిపే దృశ్యం, పొడిచే
ప్రొద్దుకు మల్లె తిరగలి
గరగరలో అరిగి పోతున్నది !

* *

అరుణో ! వ్యాపారస్తులు
నల్లని దుస్తులతో దూరంగా
బాకీవారల పెండ్లం పుస్తెలు
తాకట్లను చీకట్లో పొట్లం
కట్టుచు పోతున్నారు !

గస్తీ బంట్రోతులు కానీకి
చేయి చాస్తున్నారు !
పాపం ! ఏంచేస్తారు ?
ఇంట్లో పెండ్లాంబిడ్డలు
పస్తుంటే చస్తుంటే !

* *

లోకంఅంతా యింతే
వ్యాకులంతో చీకాకై పోతోంది !
తినేవారు తింటున్నారు
పంచభక్ష్యాల భోజనం !
ఉండేవారు వుంటున్నారు
వున్నత శిలా నిర్మిత భవనాల్లో!

ప్రాకార ప్రాంగణంనుండి
విస్తరాకులు విసరివేస్తే
ఎంగిలి మెతుకులు
చిక్కించు కోడానికి
కొట్లాడు కుంటున్నవి
కొన్ని కుక్కలు !

డొక్కలు పీక్కుపోయిన
మనుషులు భైరవునితో
పోట్లాడి పెంకలు చీకుతున్నారు!

ఆహారం చాలక
సహాయం కోరుతు
జాగారం చేస్తున్నవి
ప్రాగ్దేశాలు కొన్ని!

ధనికస్వాముల దర్పంతో
వ్యాపారం పేరిట దేశం
దోచుక సైనికనిర్మాణం
యంత్రాంగం దైనిక జీవనమై
యుద్ధం! యుద్ధం! అందుకు
మేం సిద్ధం! అని గాండ్రిస్తూ
అటంబాంబుల పోటీ
మారణ సామాగ్రికి
మాదే పై చేయంటూ
పశ్చిమ రాజ్యపు కూటమి
రాజ్యాలను కబళించే
పన్నాగం వేస్తున్నది!
డబ్బే యీనాటికి డిక్టేటరుగా
దేశం పాలిస్తున్నది!
దౌష్ట్యం యీరోజున
నాయకుడై తిరుగుతోంది!

## క్రాంతి:

ఇది యీనాటికి జరిగిన
అభ్యుదయం!

ఇది రాసురాను కలిగిన
    చైతన్యం!
భారతదేశపు చరిత్ర పుటలను
    మారుస్తున్నది!

అదిగో మాయస్వాముల
మారణ హోమం!
దుర్గమ వర్గాటవి
కాలుస్తున్నది!
అది ప్రజలను పీల్చిన
పిశాచ హననం,
చీకటి తెరల్ను ఛేదిస్తున్నది!

అది ఎదలో సొదయ్యై
మండిన అనలం,
ఎదురైన ముండ్లపొదల
దహిస్తున్నది!
అదిగో! నిద్రమేల్కొన్నది జగత్తు!
మార్దవహృదయాలు బిరుసెక్కినవి!
ఆరుద్రకార్తె వురుముతోంది!
ఫెళఫెళా రావాలతో
భూమి బ్రద్దలౌతోంది:
ప్రచండ ఝుంఝూ మారుతం
    వీస్తున్నది!

ఇది జనులకు పరీక్షా సమయం!
అదిగో! రక్షకదుతున్నారు!
ఇది ప్రజలకు దీక్షాసమయం!
అదిగో! ప్రతిజ్ఞ చేస్తున్నారు!

# ప్రస్తావన

'సంఘర్షణ' అంటే సామాన్యులు 'కలహం' అనీ, రాజకీయ వేత్తలు 'వర్గపోరాటం' అనీ, అర్థాలు చెప్పవచ్చు. వాస్తవికదృష్ట్యా అదేదీ సరియైందికాదు. మరి కత్తులు, కర్రలు తీసుకొని నరుక్కోవడ మూ కాదు. మరేమిటి? రెండు వ్యతిరేక శక్తుల పరస్పర విరుద్ధ విన్యాసాలే ఈ సంఘర్షణ. ఇది సృష్ట్యాదినుండి నేటివరకూ జరుగు తూనేఉంది. అసలు జగదుత్పత్తి స్థితిలయాలకు మూలమైంది ఇది ఒక్కటే. ఈ ఒక్కటే మహోత్కృష్టమైంది. శాశ్వతమైంది.

అనంత సంతోష సాగరంలో ముంచివేసే అమృతోత్పాద నకై సముద్రమథనం జరిగింది. అమృతంతో పాటు హాలాహలమూ ఉద్భవించింది. అయినా ఈ సంఘర్షణ నేడొక విశిష్టరూపాన్ని పొంది, మానవుని నిత్యజీవితంలో ప్రముఖస్థానాన్ని ఆక్రమించుకుంది. మానవుడు దిన దినమూ మానసిక పరివర్తన పొందుతూ, ఈసమస్యలను పరిష్కరింప లేకున్నాడు.

మహోన్నత ఆశయాలు మహా మేరువుల్లా నిశ్చలంగా ఉన్నాయి. ఎదురుగా మహోజ్వల కాంతి గోచరిస్తోంది. వెంటనే కారు చీకటి క్రమ్ముకొస్తోంది. మనస్సును స్వార్థం పీడిస్తోంది. ఒక ప్రక్క హింసాకాండ సాగుతోంది. మరొకప్రక్క శాంతి పూజింప బడుతోంది. జగద్విభవానికి ప్రధానియైన మానవుడు వీటిమధ్య నలుగుతున్నాడు.

విశ్వమానవ శాంతిసాధనకై సంఘర్షణ నడిపిన మహామహులే బుద్ధుడు, జీసస్, గాంధిజీ! మంచి చెడ్డలమధ్య, సత్యా సత్యాల మధ్య నేడు జరుగుతున్న ఆ సంఘర్షణ ఈకావ్యానికి ఆత్మ!

– గోపాలకృష్ణ

**SANGHARSHANA: Twelve Annas: By: RENTALA.**



రచయిత.

రెంటాల గోపాలకృష్ణ: 1920 వ సంవత్సరం సెప్టెంబరు 5 వ తేదీ పల్నాడుతాలూకా రెంటాలగ్రామంలో జననం. మహాలక్ష్మమ్మ, రామదాసులు కన్నవారు. అయిదుగురు అన్నదమ్ముల్లో ఆఖరి వాడవటంవల్ల రామలింగమ్మ, వెంకయ్యగార్లకు 1932 లో దత్తుడయ్యాడు. అప్పటినుండి 1937 వరకు నరసరావుపేట మునిసిపల్ హైస్కూల్లో విద్యార్థి. ఆనాడే ఈయనకు అనిసెట్టి, రామదాసుల సాహచర్యమూ, నాయని శిష్యత్వము అబ్బినవి. పండిత వంశాన పుట్టిన ఈయనలో అప్పటికే కవితాలత మొలకెత్తింది. 1939 లోనే 'రాజ్యశ్రీ' అనే చరిత్రాత్మక నవల వ్రాసి ప్రచురించారు. హైస్కూలుతోనే విద్యకు స్వస్తిచెప్పి మూడు సంవత్సరాలు అస్ట్రాలజీ, అస్ట్రానమీ, శాస్త్రాలను నవ్యసిద్ధాంతాలద్వారా అభ్యసించారు. ఆ తరువాత 1942 లో విజయవాడకు మకాంమార్చి, ఒక వ్యాపార సంస్థలో ఉద్యోగానికి కుదిరారు, ఎక్కువమందికిమల్లే ఈయనకూ జీవితంలో ఎక్కువభాగం ఉద్యోగాలమధ్య వ్యయం అయింది.

వ్రాసినవి ఎక్కువభాగం పత్రికలకు పంపకపోవడం, గోప్యంగా ఉంచడం ఈయన అలవాటు. ఇటీవల వీరిగేయాలు కొన్ని ఆంధ్రపత్రిక, ఆనందవాణి, వాహిని, జనవాణి, కాగడాల్లో ప్రకటితమైనాయి. ఈ ఉజ్జ్వల కావ్య సంపుటి 'సంఘర్షణ' సాహితీ స్రవంతి తొలిప్రచురణ.

**SAHITI SRAVANTHI: Vijayavada.**

WRAPPER PRINTED AT SWATANTRA ART PRINTERS, VIJAYAWADA-2.

66

